## ప్రకటన

కేసరపల్లి గన్నవరములో (కృష్ణాజిల్లా) మా ఆంధ్ర దైనిక, సచిత్ర వార, భారతి మాస పత్రికలను వారి స్వంతబాధ్యతపై విక్రయించుటకు శ్రీ టి. వి. ఎ. కృష్ణమూర్తిగారిని తే. 26-4-49 ది నుండి నియమించడమైనది.

మేనేజరు,

## గటుంల పంచాంగం

విరోధి సం॥ చైత్ర బ॥ చతుర్దశి 1949 సం॥ ఏప్రిల్ 27 బుధవారం బ॥ చతుర్దశి ప 11-28 రేవ ప 8-24 వర్జ్యం లేదు.

బ॥ అమా॥ ఏప్రిల్ 28 గురువారం స॥ అమావాస్య ప1-32 అశ్వి 11-4 వర్జ్యం ఉ 6-37 ల 8-24 స.

# ఆంధ్రపత్రిక

విరోధి సం॥ చైత్ర బ॥ చతు॥ బుధవారం.

## రాష్ట్ర కాంగ్రెస్ తీర్మానము

చెన్నపట్నం విషయ్యములో ఆంధ్రులు తమహక్కులను వదలుకొనవలెనను నాయకత్రయ కమిటీ సూచనఎడ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గము అసంతృప్తిని వెల్లడించుట సహజము. ఆ సంఘము మరొక విధముగ అభిప్రాయము వెల్లడించునని ఎవరునూ తలచి యుండరు. రంగాగారి కాంగ్రెసు కార్యవర్గ సభ్యత్వము దానికి అవరోధము కాగలదనునది అనవసల అనుమానమని విదితమైనది. చెన్నపట్నం విషయమున ఆంధ్రులు తమ హక్కును వదలుకొనుట అసాధ్యమని తెలియజెప్పిరి. ఇదే వైఖరిని ఆదినుండి ఆంధ్రనాయకులు ప్రదర్శించిన బాగుండెడిది. కాని అట్లు జరుగలేదు. సత్వరము ఆంధ్రరాష్ట్రము కావలెనను ఆతురతలో చెన్నపట్నవిషయమున, స్పష్టముగ ఒకవైఖరిని ప్రదర్శింపలేకపోయిరి. అంతేకాక తమ సహజ సౌజన్యభావముతో తమిళులవలె చెన్నపట్నము కేవలము తమదనివాదించక, ఉభయులకు చెందవలసినదని చెప్పియుండిరి. మేముకూడ ఆవైఖరినే బలపరచి యుంటిమి. "మద్రాసు సమష్టి ప్రదేశముగ ఒక ప్రత్యేక రాష్ట్రముగ నుండవలెనని మా అభిప్రాయము. విశ్వాసము. ఆంధ్ర రాష్ట్రమునకు గాని తమిళరాష్ట్రమునకుగాని రాజధానిగ నుండకూడదు." అని 1947 సం॥ సెప్టెంబరులో ఆంధ్ర రాష్ట్ర రాజకీయ మహాసభ జరిగినపుడు వ్రాసియుంటిమి. ఇప్పటికినీ మా విశ్వాసమదే.

కాని అప్పుడు ఆంధ్ర రాజకీయ మహాసభ చెన్నపట్నం విషయమున చేసిన తీర్మానము కొంతవరకు ఆంధ్రుల వాదము విషయమున చతురతను చూపలేదు. ఆ సందర్భమున మేమాతీర్మానమును విమర్శించి యుంటిమి. చెన్నపట్నము ఉభయప్రాంతముగ నుండవలెనని మహాసభ కావ్యనర్థ తీర్మానము కోరినది. ఆ తీర్మానమునకు అంటిపెట్టుకొనిన బాగుండెడిది. అలాకాక, "సరిహద్దు నిర్ణయసంఘము తీర్పు తేలువరకు, చెన్నపట్నం ప్రస్తుతము ఉభయప్రాంతముగ పరిగణింపబడి, దాని పరిపాలనము సర్ బి. ఎన్. రావుగారి ప్రణాళికలో తెలుపబడిన విధముగా ఏర్పాటుకావలెనని," విషయనిర్ణయసభ తీర్మానించినది. చెన్నపట్నం "పరిపాలన తాత్కాలికముగా సర్ బి. ఎన్. రావుగారి పథకము ననుసరించి" ఏర్పరచవలెనని మహాసభ తీర్మానించినది. సర్ బి. ఎన్. రావు శాశ్వతముగ నుండవలెనని తెలిపిన దానిని తాత్కాలికముగ ఉంచి, అసలు నిర్ణయమును సరిహద్దు సంఘమునకు వదలివేయుట మద్రాసు మాది అను మాటకు బలము పోగొట్టుటేగాక ఉభయులది అన్న వాదమునకుకూడ బలముపోగొట్టినది. చెన్నపట్నము ఉభయులకు చెందవలసినది అని చెప్పి ఆ విషయమున ఒకరితీర్పు ప్రసక్తి అనవసరమని చెప్పియుండ వలసినది. చెన్నపట్నము విషయమును సరిహద్దు సంఘమునకు వదలివేసిన ఆ విషయమున సగముహక్కును మనము వదులుకొనినట్లవునని, "మిగత సగము హక్కును సరిహద్దు సంఘము ఊడగొట్టగలదని" మేము వ్రాసియుంటిమి. చెన్నపట్నమునకు సంబంధించినంత వరకు సరిహద్దు సంఘముతో నిమిత్తములేక అది ఉభయప్రాంతముగ చేయవలెనని కోరవలెను. ఆ సంఘము చేయవలసినది దాని పరిసరప్రాంతములను చేర్చి రాష్ట్రసరిహద్దులను నిర్ణయించుటే. అపుడు ఆంధ్రరాష్ట్ర రాజకీయ మహాసభ చెన్నపట్నం విషయమున చేసిన తీర్మానంఎడ మేము వెలిబుచ్చిన అనుమానం ఇపుడు రూఢి అయినది. ఆ తీర్మానం చెన్నపట్నమును ఉభయప్రాంతంగా ఏర్పాటు చేయుటకు ఉపకరించుటలేదని నాయకత్రయ కమిటీ సూచనవల్ల రూఢిఅయినది. ఈ కమిటీలో భారత ప్రధాని, ఉపప్రధాని కాంగ్రెసు అధ్యక్షు లున్నారు. మరే సంఘమునకు కూడ ఇంతకన్న ఉత్తముండునని అనుకొనుటకు వీలులేదు.

"చెన్నపట్నం భవితవ్యం తేలేవరకు రాష్ట్రం వద్దనే భావముంటే దానిని అంగీకరించమని" రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ రంగాగారు ఆ సభలో తెలిపిరి. ఆ తీర్మానం చాల దూరదృష్టితో కూడినదని శ్రీ బులుసు సాంబమూర్తిగారనిరి. సత్వర రాష్ట్ర నిర్మాణము కావలెనను అపస్తే అప్పటి తీర్మానమునకుమూలము. చెన్నపట్నమునువదులుకొనినగాని వెంటనే రాష్ట్రము రాదనుభావము తోనాయకత్రయకమిటీ సూచనను అంగీకరించుట అయినదని, శ్రీ పట్టాభి సీతారామయ్యగారు సూచించిరి. కాని కనీసము మిగతా సరిహద్దుల పునర్నిర్మాణము న్యాయపద్ధతిని జరిగి 1949 ఆగస్టు 15 కు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము ఏర్పడు విశ్వాసముండిన కొంత ఉత్సాహకరముగ నుండెడిది. ఆలక్షణము లేకపోవుటే నాయకత్రయ కమిటీ నివేదికఎడల దేశములో ఇంత అసంతృప్తికి కారణము.

## వందరూపాయలనోట్లు గూర్చి ప్రకటన

చెన్నపట్నం, ఏప్రిల్ 25: ఇండియా రిజర్వు బ్యాంకియొక్క వందరూపాయల నోట్లనగాను వాడబడే కాగితములో కొంత మార్పు యుండగలదని ప్రకటింపబడు చున్నది. ఈ క్రొత్తనోట్లలో ప్రస్తుతము నీటిచారలు కనిపించుచూ చట్టముగా కట్టుబడియున్న కట్టినలులునందు పాన్చ్య మధ్యప్రాంతము ఖాళీలు రాజుగారి నీటిచారల త్రొత్త ప్రతిమయుండును. దీనికి అదృశ్య నీటిచారల యుండిన అంశములన్ని యును దుష్ప్రకాశిత మార్గప్రకారముగా నుండును. మామూలు 5/71 అంకెతో అమలులో వచ్చును.

## భారతదేశములో డైసెల్ ఇంజన్ల నిర్మాణము

### ఫాక్టరీస్థాపించు స్కీము విచారణలో నున్నది

పూనా, ఏప్రిల్ 25: డైసెల్ ఇంజన్ల నిర్మాణమునకు ఒక ఫాక్టరీని స్థాపించు స్కీము యొకటి ఇండియా ప్రభుత్వమువారి విచారణలో నున్నదని సప్లయిల, పరిశ్రమ లశాఖా సభ్యుడు డాక్టర్ శ్యామా ప్రసాద్ ముఖర్జీగారు కిర్కీలో కిర్లోస్కర్ ఆయిల్ ఇంజన్ల ఫాక్టరీని ప్రారంభించుచు ప్రకటించిరి. ఇప్పటున్న ఆయిల్ ఇంజన్ల ఫాక్టరీలతో ప్రభుత్వస్కీములను ఏకము చేయవచ్చునని తాను అభిప్రాయ పడుచుండెనని ఆయన చెప్పుచు దేశాభివృద్ధికి తోడ్పడుచున్న ఈ ఫాక్టరీల యజమానులతో ప్రభుత్వమువారు పోటీ చేయు ప్రసక్తి యేమియు లేదనిరి.

ఇప్పుడు దేశములో 1200 డైసెల్ ఇంజన్లు తయారగు చుండెనని, సంవత్సరమునకు 3 వేలనుండి 4 వేలవరకు ఇంజన్లు యితరదేశములనుండి దిగుమతి యగుచుండెనని ఆయన చెప్పుచు ఈ ఇంజన్ల ఫాక్టరీల వారికి గల ప్రతిబంధకములు తొలగుటకు ప్రభుత్వమువారు వీలైన అన్ని విధముల సహాయము చేసెదరనిరి. బొంబాయినుండి సింధియా టిక్ ఆయిలు తయారుచేయు ఫాక్టరీ రాబోవు కొలదిమాసములలో స్థాపితమగునని మంత్రి ఆశించెను. కార్మికులు చేతి పనులయందు తప్పకగల విధిని సద్వినియోగపరచవలెనని, యజమానులు కార్మికులు సహకారభావమున మెలంగవలెనని డా॥ ముఖర్జీగారు ఉద్బోధించిరి.

## గోనెసంచుల అధికోత్పత్తి

### భారతప్రభుత్వ ఒడంబడిక

కలకత్తా, ఏప్రిలు 25: కలకత్తాలోని జనపనార మిల్లులతో ఇండియా గవర్నమెంటు ఒక ఒడంబడికను వ్రాసికొనినట్లుగా తెలియుచున్నది. ఈ ఒడంబడిక ప్రకారము జూటుమిల్లులు మాసము 1-3.84 వేల టన్నుల సరుకు తయారుచేయవలెను. నారనూలు ఉత్పత్తి జనవరినుండి నూటికి 12½ వంతు తగ్గును. ఈ ప్రకారముగా వచ్చే మాసమునుండియు ఉత్పత్తి సాగింపబడును. నారనూలఉత్పత్తి తగ్గింపబడినప్పటికి, గోనెసంచుల ఉత్పత్తి సాధ్యమైనంతవరకు హెచ్చింపబడును. ఏదేశాలకు జనపనార సంచులు సప్లయి చేయవలసినంత పరిమితివరకు సప్లయిచేయబడుటలేదో ఆయా రాజ్యాలకు పూర్తి సప్లయి చేయవలెను. ఏరకపు సరుకునకు గిరాకీ హెచ్చునో ఆరకపు సరుకు అవసరమైనంతమేరకు హెచ్చుగా ఉత్పత్తిచేయవలెను. పాకిస్థానులో చేర్చిన తూర్పు బెంగాలునందు పండే జనపనార కొనుటకు సాధ్యమగునో అంత నారను గవర్నమెంటు కొని మిల్లులకు సప్లయి చేయును.

ఈ ఒడంబడిక ప్రకారముగా మిల్లులందు ఉత్పత్తి జరుగుచున్నదో లేదో అప్పుడప్పుడు పరిశీలన చేయబడును. అవసరమైన మార్పులు యీ పథకములో చేయబడును.

## భారత సర్వసేనానికి చైనాఖడ్గ బహుమానం

అహమ్మదాబాదు, ఏప్రిలు 25: భారత సర్వసేనాని జే. యం. కరియప్పగారికి అహమ్మదాబాదులోని మిలిటరీ డైసెల్ [illegible] సంఘమువారు చేతి సాయంకాలము స్వాగతపత్రమును సమర్పించి చిరస్మరణీయమైన బహుమానముగా చైనాఖడ్గ మొకటి యిచ్చిరి. ఈ మిలిటరీ డైసెల్ సంఘము 1938 సంవత్సరములో నెలకొల్పబడెను. ఇండియా పార్లమెంటు అధ్యక్షుడైన జి. వి. మావలంకరుగారు యీ సంఘము నకు అధ్యక్షులు.

స్వాగతపత్రములోని విషయములకు కరియప్పగారు ప్రత్యుత్తర మొసంగుచు ఇట్లనిరి.

సైనికబలములకూర్చి గాంధి మహాత్మునితో ఒకప్పుడు నేను సంభాషించియుంటిని. మేము యుద్ధములకు కాలుదువ్వువారమనియు, పరరాజ్యాలవారి ఆక్రమణదోషణ త్రిలనుండి మన దేశమును రక్షించుటకే తోడ్పడె దమనియు దేశంలో శాంతిభద్రతలు భంగము కలుగకుండా కాపాడెదమని యుద్ధ సేనా మహాత్మునితో చెప్పితిని. దేశములోని పార్టీకక్షలలో సంబంధం లేకుండా ఆయనలో సున్న ప్రభుత్వానికి ఉత్తర్వులను అనుసరించి మాత్రమే సైన్యము యొక్క కర్తవ్యమని తెలియజేసితిని.

ఇంకఏప్రాంతలో అయినా నిలిచియుండే జలసేన మొల్లంచును దర్ద చేసి చేతులనే మస్లింలందరు కాంగ్రెసులో, చేరాలని ఖాకిస్లాన్ల ముస్లింలీగ్ మాజీ కార్యదర్శి షేక్ ఉమర్ అబ్దుల్లాతీఫ్ సేఠ్ విజ్ఞప్తి చేశారు.

## నాన్కింగ్ ప్రభుత్వంతో భారత రాయబార కార్యాలయం సంబంధం

### షాంఘైను చెక్కుచెదరకుండా కమ్యూనిస్టు పరం చేయడానికి ఏర్పాట్లు

న్యూఢిల్లీ, ఏప్రెల్ 25: నాన్కింగ్‌లోని కమ్యూనిస్టు ప్రభుత్వముతో వాస్తవిక (చట్టబద్ధము గాని) సంబంధముల నేర్పరచుకొనుటకు అచటి భారత రాయబారి కార్యాలయం నిశ్చయించుకొనినట్లు, ఆ ప్రకారం త్వరలోనే సంబంధం పెట్టుకొనునట్లు అధికార రీత్యా నేడిక్కడ తెలియవచ్చింది.

నాన్కింగ్‌లోని భారత రాయబార కార్యాలయంలోనూ, నగరంలోనూ ఉన్న దాదాపు 100 మంది భారతీయులు సురక్షితంగా ఉన్నట్లు నేడిచ్చటినుండి వార్త వచ్చినది. నగరంలోని భారతీయుల జాబితాను వారి ఆస్తి వివరాలలో సహా ఒక నివేదికను భారత రాయబార కార్యాలయం నాన్కింగ్‌లోని స్థానిక ప్రభుత్వమునకు అందచేయునని తెలుస్తున్నది. నాన్కింగ్ భారతదేశం వార్త ప్రసార ఏర్పాట్లు మామూలుగానే ఉంటున్నవి.

నేడచటి భారతరాయబార కార్యాలయంనుండి వచ్చిన వర్తమానం బట్టి కమ్యూనిస్టుల నగరాన్ని ప్రశాంతంగా ఆక్రమించినట్లు అచటి విదేశీయులకు ఎట్టి నష్టమూ జరుగలేదని తెలుస్తున్నది.

### వాషింగ్టన్‌రమ్మని అమెరికా రాయబారికి పిలుపు

వాషింగ్టన్, ఏప్రిల్ 25: యాంగ్సీ నది, దిగువలోయలలోఉన్న అమెరికనుల రక్షణకు అవసరమైన ఏర్పాట్లుచేయడం పూర్తికాగానే సంప్రతింపుల నిమిత్తం వాషింగ్టన్ రావలసిందని చైనాలోని అమెరికా రాయబారి లైటన్‌స్టువర్టుకు కబురుపెట్టినట్లు అధికారరీత్యా నేడిక్కడ తెలిసింది. నాన్కింగ్ కమ్యూనిస్టుల వశమైనపుడు అమెరికా రాయబారి నగరంలోనే ఉన్నాడు.

### కమ్యూనిస్టులు చైనా నంతటినీ ఆక్రమించటం తథ్యం

#### కొమింటాంగ్ కిక ఆశలేదని అమెరికన్ ఉద్యోగుల నమ్మకం

వాషింగ్టన్, ఏప్రిల్ 25: "కమ్యూనిస్టులు అతి శీఘ్రకాలంలోనే దక్షిణ చైనాలో అన్ని ప్రాంతాలకు చొచ్చుకొని పోగలరు. దీనికి వారిని ఆటంకపరచగల కారణం సైనిక దృష్ట్యా ఒక్కటికైనా కూడా కనిపించటం లేదు. కొమింటాంగ్ ప్రభుత్వ సేనలకు పట్టిన దుస్థితికి ఇంక తిరుగులేదు. వారికింక ఆశలేదు. అయితే ఈ దుస్థితికి ముఖ్య కారణం చాంగ్ కైషేక్ ప్రభుత్వపు అసమర్థత, అనాయకత్వాలే" అని అమెరిక ప్రభుత్వ శాఖలోని ఉన్నతాధికారులు భావిస్తున్నారు, కీ.రీ అంశాలను నాటున వెల్లడించినప్పటికీ అవి ఇప్పుడిప్పుడే పత్రికలకు ఎక్కుతున్నవి.

కొమింటాంగ్ ప్రభుత్వం చైనాప్రజల విశ్వాసాన్ని గోల్పోయినదనీ, అమెరికా చేసిన సహాయాన్నంతా దుర్వ్యయం చేసినదనీ, ప్రపంచము ఎక్కడా కనివిని ఎరగనంతటి అసమర్థమైన నాయకత్వాన్ని ప్రదర్శించినదనీ ఇక్కడ భావింపబడుతున్నది.

ఇంతవరకూ అమెరికా ప్రభుత్వం చైనాలో అనుసరించిన విధానాన్ని సమర్థించిన వారందరూ ఆ విధానం భగ్నం కావటానికి కొమింటాంగ్ ప్రభుత్వమే కారకురాలు కాని అమెరికా కాదని అంటున్నారు. 1945 లో జపాన్ యుద్ధం పూర్తి అయినప్పటినుంచీ కమ్యూనిస్టుల నణచటానికి, అమెరికా కొమింటాంగ్‌కు 200 కోట్ల డాలర్ల సామగ్రిని సహాయం చేసినదని వారు వెల్లడించారు.

### షాంఘయ్ రక్షణకు ప్రభుత్వ సన్నాహాలు

#### అమెరికన్ శిక్షితసైన్యాల తరలింపు

షాంఘయ్, ఏప్రిల్ 25: ఫార్మోజా దీవిలో అమెరికన్ నిపుణులచేత శిక్షణ ఇవ్వబడిన 15 వేల ప్రభుత్వసేనలు నేడు షాంఘయ్ రక్షణకు రప్పించబడినవి. నగర రక్షణకై ఇంతకుముందు ఉన్న 6 లక్షల కొమింటాంగ్ సేనలకు తోడుగా ఈ సుశిక్షిత సైన్యాలు రప్పించబడటం వల్ల నగర వాసులకు కొంత ధైర్యం చిక్కినది తెలుస్తున్నది. బలవత్తరమైన రక్షణస్థావరాలు నిర్మించబడినవిగదంపడి ంగా ఉన్నవనీ, నగరంలో ఉన్న సుశిక్షిత సైన్యాలకు తోడుగా వివిధ ప్రాం

తాలనుంచీ 'పిడుగు' సైన్యాలు రప్పించబడుతున్నవనీ, షాంఘయ్ తాత్కాలిక మేయర్ చెన్‌లియాంగ్ నేడు విలేఖరులకు తెలియజేసెను.

షాంఘయ్‌నుండి ఉన్నత ప్రభుత్వాధికారులకు కాంటన్‌కు తీసుకొని పోవుటకు విమానాలు సిద్ధంగా ఉన్నవి. రెండు నౌకలలో ఎగ్జిక్యూటివ్ యువాన్ సభ్యులు, కుటుంబాలు, ఉద్యోగులు ఫార్మోజాకు నేడు బయలుదేరుతున్నవి. ఇక్కడ బ్రిటిషువారలను ఖాళీచేసి తీసుకుని రావటానికి హాంకాంగ్‌నుండి ప్రత్యేక విమాన సర్వీసు ఏర్పరచబడినది

కమ్యూనిస్టు అగ్రదళాలు షాంఘయ్‌కి 35 మైళ్ల దూరంలో ఉన్న రైల్వే కూడలి సూచౌను సమీపించినవి. అక్కడ భీషణ పోరాటం జరుగుతున్నట్లు తెలుస్తున్నది. సూచౌ ఇంకా ప్రభుత్వం చేతుల్లోనే ఉన్నదనీ, షాంఘయ్‌కి దక్షిణంగా సంబంధం కలిపే షాంఘయ్-హాంచౌ రైలు మార్గం వారిచేతుల్లోనే ఉన్నదనీ ప్రభుత్వ వార్తా సంస్థనేడు ప్రకటించినది.

### చైనా రంగానికి మరొక బ్రిటిష్ క్రూయిజర్

బ్రిటిష్ క్రూయిజర్ జమైకా మధ్య అమెరికా దీవులనుంచి దూర ప్రాచ్యానికి బయలుదేరుతున్నదని బ్రిటిష్ నౌకాదళ శాఖ నేడు లండన్‌లో ప్రకటించినది. నాన్కింగ్, షాంగ్‌య్ ప్రాంతంలో ఉన్న బ్రిటిష్ యుద్ధ నౌకలు 'పరిస్థితులు చక్కబడిన వెంటనే' ఆ ప్రాంతాన్ని వదలిపెట్టగలవని ఈ ప్రకటనలో తెలియజేయబడెను.

### చైనా కమ్యూనిస్టులకు అమెరికా ఆక్షేపణ

వాషింగ్టన్, ఏప్రిల్ 25: నేడు నాన్కింగులోని అమెరికన్ రాయబారి కార్యాలయంలోకి అక్రమంగా 12 మంది సాయుధ కమ్యూనిస్టు సైనికులు ప్రవేశించి అవరణనంతా సోదాచేసి వెళ్లినందుకుగాను కమ్యూనిస్టు సైనికాధికారులకు తీవ్ర రసన తెలుపవలసినదని అమెరికా ప్రభుత్వం నాన్కింగ్‌లోని తమ సైనికప్రతినిధికి నేడు ఉత్తరువిచ్చినది.

ఈ సంఘటనపై నాన్కింగ్ నుండి అమెరికన్ రాయబారి కార్యాలయం పంపిన తంతివార్తలో, కమ్యూనిస్టుసైనికులు కార్యాలయంలోకి ప్రవేశించి ఆయుధాలుచూపి లోపల అంతటా సోదా చేసి, ఏమీ కదిలించకుండానే వెళ్లిపోయినారని చెప్పబడినది. ఆ వస్తువులన్నిటినీ వారు పరిశీలిస్తూ ఇవన్నీ ప్రజలవే. అవి చివరకు వారికే చెందగలవు అని అన్నారట.

### కీ॥ శే॥ ధన్వాడ అనంతంగారు

#### నూరేండ్ల క్రైస్తవనాయకుని మరణము

మదరాసు, ఏప్రిల్ 25: కానను డి. అనంతంగారు, ఆంధ్రదేశ క్రైస్తవ సంఘప్రముఖులు, శనివారం రాత్రి హఠాత్తుగా రాజమండ్రి నటకర్లోని నివాసములో కాలధర్మము నొందిరి. గురువారం అకస్మాత్తుగ స్పృహ తప్పిపోయినది. డా॥ భరద్వాజ రామచంద్రరావు ఎం. ఎల్. ఏ. డి. బి, డి. ఆనందరావుగార్లు వీరి కుమారులు.

అనంతంగారు బందరు నోబులు కాలేజీలో 17 సం॥లు లెక్చరరుగనుండి తరువాత విజయవాడ హైస్కూలు హెడ్ మాస్టరుగా నుండిరి. సీతివాణి, సత్యదూత అను పత్రికలు, తెలుగులో బైబిలు తెలుగు నిఘంటువు ప్రకటించిరి ఇంగ్లాండులో వీరుయిచ్చిన ఉపన్యాసాలు పలువురు హర్షించిరి. గుంటూరులోని ఆంధ్ర క్రిస్టియను కాలేజిలో వీరి పేరన యివేవల ఒక స్కాలరుషిప్పు యేర్పాటు చేసిరి. విజయవాడలో అనంతం ఆస్పత్రి కట్టించిరి. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో క్రైస్తవ శేశాశ్రమనకు అవకాశములు ఎక్కువ చేయుటకు సహాయం చేసిరి. కానను అనంతంగారికి జూను 4వ తేదికి 100 సంవత్సరములు నిండును.

## ఆంధ్రకాంగ్రెస్ తీర్మానం

[1 వ పేజీ తరువాయి]

మిందును కార్యవర్గం వేరొక తీర్మానం చేసింది. పశ్చిమ గోదావరిజిల్లా కాంగ్రెస్ అధ్యక్షుని ఎన్నికతగాదా విషయమై ఈనెల 23వ తేదీన కాంగ్రెస్ అధ్యక్షుడు డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు వెంటనే కార్యాలయాన్ని అల్లూరి సత్యనారాయణరాజుగారికి అప్పగించ పెట్టాలంటూ ఇచ్చినతీర్పును పరిశీలించి అలాంటి ఉత్తరువును జారీచేయడానికి కాంగ్రెస్ అధ్యక్షునికి జూరిస్‌డిక్షన్ లేదనీ రాష్ట్ర ఎన్నికల ట్రిబ్యూనల్ అధ్యక్షుడిచ్చిన తీర్పులో రాష్ట్ర కాంగ్రెసు కల్పించుకొనజాలదని వేరొక తీర్మానం చేసినట్లు తెలుస్తున్నది.

కార్యవర్గ సమావేశం తిరిగి రేపుకూడా జరుగుతుంది. ప్రకాశంపంతులుగారు ఈ రోజు మెయిల్‌లో చెన్నపట్నానికి తిరిగి వెళ్లినారు.

## రాష్ట్రపతి పట్టాభి అభిప్రాయం

చెన్నపట్నం, ఏప్రిల్ 26: రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గంవారు గావించిన తీర్మానముపై రాష్ట్రపతి భోగరాజు పట్టాభి సీతారామయ్యగారిని ఏమి చెప్పెదరని ఆంధ్రపత్రిక ప్రతినిధి అడుగగా "నేను చెప్పవలసిన దంతా ఇదివరకే స్పష్టంగా చెప్పాను. ఇప్పుడు క్రొత్తగా చెప్పవలసింది ఏమీ లేదు" అన్నారు. చెన్నపట్నం వదులుకుంటేనే ఇప్పుడు రాష్ట్రం వస్తుందనీ, లేకపోతే ఎన్నటికి వస్తుందో తెలియదనీ పట్టాభిగారు చెన్నపట్నం రాగానే చెప్పిన సంగతి పాఠకులకు బాగా విశదమే.

### ప్రకాశంగారి అభిప్రాయం

శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు పళ్లంరాజుగారితోసహా నిన్న రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గానికి హాజరై నేటి విమానంలో చెన్నపట్నం వచ్చిరి. వచ్చిన వెంటనే ఆంధ్రపత్రిక ప్రతినిధివారిని సందర్శించి రాష్ట్ర కార్యవర్గం తీర్మానంపై ఏమి చెప్పెదరనగా "నేనుగూడా రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గ సభ్యుడనే కదా" అన్నారు. దానిపై వివరణ ఏమైనా చెప్పెదరా అనగా" వివరణగాని ప్రకటనగాని చెయ్యవలసినపనిలేదు. మే 10 వ రాష్ట్ర కాంగ్రెసు సమావేశం జరిగిన మీదట మాట్లాడవచ్చును. ఇప్పుడు మాట్లాడవలసింది ప్రజలు – నాయకులు గారు" అని చెప్పిరి.

ప్రకాశంగారు ఆంధ్రదేశంలో కొన్ని ప్రాంతాలు పర్యటించ ఆలోచించుచున్నామనిరి.

## ఇండొనీసియా సంప్రతింపులపై రిపబ్లికన్ ప్రకటన

1 వ పేజీ తరువాయి

గలదు. భద్రతాసంఘం తీర్మానం జరిగి దాదాపు 90 రోజులైంది. ఈలోపున ఏమీ జరుగలేదు. గెరిల్లాయుద్ధ ప్రజ్వలన డచ్ నిర్బంధ చర్యలు మాత్రం సాగుతున్నవి." అని రిపబ్లికను ప్రతినిధివర్గం ఈప్రకటనలో తెలియచేసింది.

## డచ్చి విఫల దాడులు

### రహదార్లన్నీ రిపబ్లికన్లవశం

లండన్, ఏప్రిల్ 25: "ప్రస్తుతం సుమత్రా దీవిలో సావరం ఏర్పరచుకుని ఉన్న రిపబ్లికన్ తాత్కాలిక ప్రభుత్వాన్ని చుట్టుముట్టనైనచేయాలన్న ఉద్దేశ్యంతో డచ్చి సేనలు ఏప్రిల్ 23వ తేదీనుంచి సుగెరియ్‌పెనా, జు రూప్ ల మధ్య ప్రాంతంపై పెద్దదాడులు జరిగినవి. కాని అవి విఫలమైపోయినవి. ఈ దాడులవల్ల రిపబ్లిక్ రక్షణవ్యవస్థ అంతా సర్వసన్నద్ధమైయుందన్న విధానాన్ని విచ్ఛలవిడిగా జరిపినవి. పశ్చిమ జావాలో రిపబ్లికన్ కార్యక్రమం అనుకున్న ప్రకారం యథావిధిగా సాగిపోతున్నది. అక్కడి రబ్బరుతోటలలో సగానికిసగం పనికి రాకుండా చేయబడినవి. రిపబ్లికన్ సైన్యాలు రహదార్లన్నిటినీ పూర్తిగా తమ స్వాధీనంలోకి తెచ్చుకొని, దేశంలో భీతావహం కలిగించటానికై డచ్చివారు రెచ్చగొట్టిన బందిపోటు దొంగల నందరినీ నిర్మూలించినవి" అని రిపబ్లికన్ సైన్యశాఖ తెలియజేసినదని లండన్‌లోని రిపబ్లికన్ కార్యాలయం నేడు ప్రకటించినది.

డచ్చివారు ఏప్రిల్ 10వ తేదీన రిపబ్లికనుల వశంలో ఉన్న ఇంద్రపురందర్గర సేనలనెదిరించగా రిపబ్లికనుసేనలు వాటితో 10 గంటలసేపు పోరాటంజరిపి, నగరంలో పనికివచ్చే వాటిన్నిటినీ నాశనంచేసి వెనక్కుతగ్గినవి. అక్కడనుండి ముర్రమన్ ప్రాంతానికివెళ్లి ప్రయత్నించిన డచ్చివారికి ముర్రమన్, జూపూర ప్రాంతంలోని రిపబ్లికన్‌లు ధ్వంసంచేసిన ముర్రమన్ బంగారుగనులు, విద్యుచ్ఛక్తి యంత్రశాలలు కనపించినవి.

## బర్మా కమ్యూనిస్టులలో అంతఃకలహము

### ఎరుపు, తెలుపు జెండాలవారి మధ్య పోరాటం సాగుచున్నట్లు వార్త

రంగూన్, ఏప్రెల్ 25:- బర్మాలో ఎర్రజెండా కమ్యూనిస్టులకు, తెల్లజెండా కమ్యూనిస్టులకు మధ్య పోరాటం సాగుచున్నట్లు వార్తలు వస్తున్నవి.

తెల్లజెండా కమ్యూనిస్టులు కొంగ్యివద్ద ఎర్రజెండా కమ్యూనిస్టుల బలీయ స్థావరాలలో ఒక దాన్ని ఆక్రమించేసు కున్నారని తెల్లజెండా కమ్యూనిస్టులతో తలపడటానికి, మ్యింగ్ కాగ్ వద్దనున్న ఎర్రజెండా కమ్యూనిస్టులు తమ అంగబలాన్ని ఆయుధబలాన్ని సమకూర్చుకొని సన్నద్ధమగుచున్నారని, రంగూన్ చేరిన ఒక వార్తనుబట్టి తెలుస్తున్నది.

## వాణిజ్య పంటలపై విక్రయపన్ను

### ఆర్థికమంత్రి వివరణ

చెన్నపట్నం, ఏప్రిల్ 26: ఆర్థిక మంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు పత్రికా ప్రతినిధులతో పన్నుల మినహాయింపు వివరములకూర్చి యిట్లు చెప్పిరి

కొబ్బరికాయలు, వేరుసెనగ మినహాగా నూనెగింజలు, చెరుకు, మిర్చి, కాఫీ, రబ్బరు, బంగాళాదుంపలు, మిరియాలు, పసుపు, ద్రవ్యాల ప్రథమ విక్రయంపై యథాప్రకారంగా విక్రయాల పన్ను ఉండదు. అయితే యితర సరుకులందు ఒక రూపాయకు 3 పైసలు ఉన్న పన్ను 4½ పైసలవరకు హెచ్చింపబడును. ఈ పన్ను మినహాయింపుల వల్ల ప్రభుత్వమునకు అంచనా వేసిన ఆదాయములో ఒక కోటి రూపాయలు తక్కువ రావచ్చును.

### పెన్నార్ కుముద్వతి ప్రాజెక్టు

పెన్నార్ కుముద్వతీ ప్రాజెక్టు నిర్మాణ కార్యభారముల నిమిత్తం మంత్రి నీలం సంజీవరెడ్డిగారు రేపుసదయం విమానంలో బెంగుళూరుకు వెళ్లుచున్నారు. ఎల్లుండి సాయంత్రం తిరిగి వచ్చెదరు.

### మోటారు ధరలు

రవాణా మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు మోటారు వ్యాపారస్థులను నిన్న కలుసుకొని మోటారుసరుకు కంట్రోలును గూర్చి చర్చించిరి. ధరలు అట్లే యుంచుటకును వ్యాపారస్థులకు లాభాల రేట్లు యథాప్రకారముగానే యుంచుటకును నిర్ణయింపబడెను.

## పండితులు, మున్షీల జీతములు

మదరాసు, ఏప్రిల్ 25: ప్రాచ్యభాషల యందు ప్రవీణుడని సర్టిఫికేటువుండు 1948 ఏప్రిల్‌నాటికి 15 సం॥ముల సర్వీసు వున్న పండితులకు, మున్షీలకు యల్ టి లకు ఇచ్చుజీతము స్కేలు ఇవ్వవచ్చుని ప్రభుత్వము ఉత్తర్వులు చేసినవి. మదరాసు ఎడ్యుకేషనల్ రూల్సుక్రింద ప్రాచ్యభాషలలో సర్టిఫికేటు వున్నా డిగ్రీ వున్నా ఉన్నతపాఠశాలలో పండిట్‌గ నియమించబడుతున్నారు. ప్రధానభాషను బోధించువరకు ఉభయులకు తేడా ఏమీ లేదు. అందువలన ప్రభుత్వము పైవిధముగ నిర్ణయించినది.

### ట్రాము బండ్లమీద పన్ను

చెన్నపట్నం, ఏప్రిల్ 26: ట్రాము బండ్లలో ప్రయాణీకుల సీటునుబట్టి పన్నును కార్పొరేషనువారు విధించుటకు వీలగునట్లు కార్పొరేషను చట్టమును సవరించవలెనని ప్రభుత్వమును కోరుచూ కార్పొరేషను వారుపెనుక మార్చిలో జరిగిన సభలో తీర్మానం చేసి, కోరియుండిరి. అప్పటి తీర్మానములో ట్రాముబండ్లలో ప్రయాణీకులకు ఎన్ని సీట్లు కలవో ఒక్కొక్కదానికి మూడు నెలలకు రూ 15 చొప్పున పన్ను విధించవలెనని అనబడెను. కాని ఇపుడు ట్రాముబండ్లలో సీట్లలో కూర్చొని ప్రయాణం చేసేవారిలో ఒక్కొక్కరికి రూ 6, నిలిచి ప్రయాణం చేసేవారికి చెరి రూ 3 చొప్పున నెలకు పన్ను వసూలు చేయుట మంచిదని కమిషనరుగారు సూచనచేసి యున్నారు. ఈ సూచన కార్పొరేషను సభవారి ఆలోచనకు త్వరలో రానున్నది.

## స్థానికసంస్థలక్రింది ఉపాధ్యాయులు

మదరాసు, ఏప్రిల్ 25: జిల్లా బోర్డులు, మునిసిపల్ కౌన్సిళ్లక్రింద పనిచేయు సెకండరీ స్కూలు ఉపాధ్యాయులకు ప్రభుత్వ ఉద్యోగములోనున్న ఉపాధ్యాయులకిచ్చు జీతముల స్కేలును వర్తింపచేయుటకుగాను స్థానికసంస్థలు తెంగుకు అగు అదనపు ఖర్చును వారి సొంతనుండి వినియోగించకల్గినయెడల ప్రభుత్వమువారి అనుమతితో గవర్నమెంటు ఇచ్చు జీతములను ఇవ్వవచ్చును అని ప్రభుత్వము నిర్ణయించినది.

# ఇన్‌కంటాక్సు

## (ఆదాయపు పన్ను)

1949 వ సం॥ ఏప్రిల్ నెల 1 వ తేదీతో ప్రారంభమగు రాబడిపన్ను విధించు సంవత్సరమునకు పూర్వపు సంవత్సరములో మొత్తపు రాబడియున్నూ, ప్రపంచపు రాబడియున్నూ తెలియచేయురిటర్న్సు:—

1922 వ సంవత్సరపు ఇండియా రాబడిపన్ను చట్టపు (1922 సంవత్సరపు ఆక్టు 11) 22 (1) సెక్షను ననుసరించి యింకతో జతపరచిన షెడ్యూలునందలి 1 వ కలములో ప్రతి ఇన్‌కంటాక్సు ఆఫీసరు 2 వ కలములో చెప్పిన తమ తమ అధికారపు హద్దులలో యున్నట్టియు, రాబడిపన్ను విధింపజాలని మొత్తపు రాబడికంటే అధికముగా పూర్వ సంవత్సరములో రాబడి గలిగియున్న ప్రతిమనుజునకు యిందుమూలముగా తెలియచేయున దేమనగా, యీ నోటీసు తేదీ మొదలు 65 రోజులలోగా, నిర్ణయించిన నమూనాలో నిర్ణయించినరీతిగా నిరూపించి తమయొక్క పూర్వపు సంవత్సరమునందలి మొత్తపురాబడి యున్నూ మొత్తపు ప్రపంచ రాబడియున్నూ (నమూనాలో కోరబడిన యితర వివరములతోసహా) తెలియచేస్తూ వారివారి ఆఫీసరులకు అందచేయవలయును.

ఇందుకుగాను నిర్ణయింపబడిన నమూనా పత్రములు వారికి ఉచితముగా ఒకటి ఆయా ఇన్‌కమ్ టాక్సు ఆఫీసులవద్ద అడిగినయెడల యివ్వబడును.

**అపరాధము:**—ఈ నోటీసులో చెప్పిన ప్రకారము ఎవరైనా తగు కారణములేకయే రిటర్న్సు అందచేయకపోయినను, లేక సకాలములో తగు కారణము లేకయే అందచేయకపోయినను, లేక నిర్ణయించిన రీతిని అందచేయనియెడలను, ఈ ఆక్టు 28 వ సెక్షను క్రింద వారు చెల్లించవలసినపన్నుకు 1½ రెట్లు ఎక్కువకాని అపరాధమునకు లోనగుదురు.

**పన్ను విధించు చోటు:**—ఈ ఆక్టు 64 వ సెక్షను ననుసరించి పన్ను విధించుటకు లోనగువారు ఏయేచోట్ల తమవ్యాపారముగాని, వృత్తిగాని లేక యితర పనినిగాని నిర్వహించుచుందురో, ఆయాచోటుమీద అధికారముగల ఇన్‌కమ్ టాక్సు ఆఫీసరు లేక పన్ను విధించుటకు లోనగువారు అనేకచోట్లయందు తమ వ్యాపారముగాని, వృత్తిగాని, యితర పనులుగాని నిర్వహించుచున్నయెడల, ఆయా వ్యాపారము, వృత్తి యితర పనులు నిర్వహింపబడు ప్రధాన స్థలముమీద అధికారముగల ఆఫీసరు, మరియు తదితరుల మీద తాము నివసించు స్థలముమీద అధికారముగల ఇన్‌కంటాక్సు ఆఫీసరు రాబడిపన్ను విధింతురు. కాని యే ఇన్‌కంటాక్సు ఆఫీసరుకైనను, కొన్ని విధములగు రాబడులమీద గాని, మనుష్యులమీద గాని పన్ను విధించుటకు అధికారమీయబడినచో, అట్టి ఆఫీసరు అట్టి విధములగు ఆదాయము లేక మనుష్యుల మీద పన్ను విధించుటకు అధికారముకలదు.

తేదీ 26—4—1949.

### షెడ్యూలు

| పేరు, ఉద్యోగము. | విలాసము. | అధికారముగల హద్దులు నమూనా సమర్పించవలెను. |
|---|---|---|
| బి. అబ్రహాం, ఇన్‌కంటాక్సు ఆఫీసరు | విజయనగరం సర్కిలు విజయనగరం | విజయనగరం సర్కిలు |
| కరీం మొహిద్దీన్, అడిషనల్ ఇన్‌కంటాక్సు ఆఫీసరు | డిట్టో | డిట్టో |
| టి. వెంకటేశ్వరరావు, ఇన్‌కంటాక్సు ఆఫీసరు | విశాఖపట్టణం సర్కిల్ విశాఖపట్టణం | విశాఖపట్టణం సర్కిలు |
| టి. రామచంద్రరావు, ఇన్‌కంటాక్సు ఆఫీసరు | కాకినాడ సర్కిల్ కాకినాడ | కాకినాడ సర్కిల్ |
| జి. నారాయణరావు, అడిషనల్ యిన్‌కంటాక్సు ఆఫీసరు | డిట్టో | డిట్టో |
| కే. జగన్నాథరాజు, యిన్‌కంటాక్సు ఆఫీసరు | రాజమండ్రి సర్కిల్ రాజమండ్రి | రాజమండ్రి సర్కిల్ |
| యం. కలీరు షా, అడిషనల్ యిన్‌కంటాక్సు ఆఫీసరు | డిట్టో | డిట్టో |
| యం. వి. లక్ష్మయ్య, యిన్‌కంటాక్సు ఆఫీసరు | ఏలూరు సర్కిల్ ఏలూరు | ఏలూరు సర్కిల్ |
| కె. వి. సుబ్రహ్మణ్య అయ్యరు, ఇన్‌కంటాక్సు ఆఫీసరు | మచిలీపట్టణం సర్కిల్, మచిలీపట్టణం. | మచిలీపట్టణం సర్కిల్ |
| ఎ. రామమోహనరావు, ఇన్‌కంటాక్సు ఆఫీసరు | విజయవాడ సర్కిల్ విజయవాడ | విజయవాడ సర్కిల్ |
| వి. వి. సుబ్బారాయుడు, 1 వ అడిషనల్ ఇన్‌కంటాక్సు ఆఫీసరు | డిట్టో | డిట్టో |
| ఐ. నాగభూషణరావు, 2 వ అడిషనల్ ఇన్‌కంటాక్సు ఆఫీసరు | డిట్టో | డిట్టో |
| పి. కె. బాలకృష్ణన్, ఇన్‌కంటాక్సు ఆఫీసరు | గుంటూరుసర్కిల్ గుంటూరు | గుంటూరు సర్కిల్ |
| వి. వెంకటరత్నం, 1 వ అడిషనల్ ఇన్‌కంటాక్సు ఆఫీసరు | డిట్టో | డిట్టో |
| టి. డి. ప్రసాదరావు, ఇన్‌కంటాక్సు ఆఫీసరు | తెనాలి సర్కిల్ తెనాలి | తెనాలి సర్కిల్ |
| ఆర్. సూరిరాజులు, అడిషనల్ ఇన్‌కంటాక్సు ఆఫీసరు | డిట్టో | డిట్టో |
| యి. వెంకటేశ్వరరావు, ఇన్‌కంటాక్సు ఆఫీసరు | బాపట్ల సర్కిల్ బాపట్ల | బాపట్ల సర్కిల్ |
| కే. నరసింహం, అడిషనల్ ఇన్‌కంటాక్సు ఆఫీసరు | డిట్టో | డిట్టో |
| బి. జాన్, ఇన్‌కంటాక్సు ఆఫీసరు | నెల్లూరు సర్కిల్ నెల్లూరు | నెల్లూరు సర్కిల్ |
| ఎ. సత్యనారాయణ, అడిషనల్ ఇన్‌కంటాక్సు ఆఫీసరు | డిట్టో | డిట్టో |
| డి. సత్యనారాయణరాజు, ఇన్‌కంటాక్సు ఆఫీసరు | కడప సర్కిల్ కడప | కడప సర్కిల్ |
| డబ్ల్యు. వెంకటరంగం, అడిషనల్ ఇన్‌కంటాక్సు ఆఫీసరు | డిట్టో | డిట్టో |
| జి. నాగయ్య, ఇన్‌కంటాక్సు ఆఫీసరు | కర్నూలు సర్కిలు కర్నూలు | కర్నూల్ సర్కిల్ |
| యస్. రాఘవన్, అడిషనల్ ఇన్‌కంటాక్సు ఆఫీసరు | డిట్టో | డిట్టో |
| కె. యస్. యస్. రెడ్డి, ఇన్‌కంటాక్సు ఆఫీసరు | బళ్లారి సర్కిల్ బళ్లారి | బళ్లారి సర్కిల్ |
| జి. శ్రీనివాసరావు, అడిషనల్ ఇన్‌కంటాక్సు ఆఫీసరు | డిట్టో | డిట్టో |
| పి. కామేశ్వరరావు, ఇన్‌కంటాక్సు ఆఫీసరు | అనంతపురం సర్కిల్ అనంతపురం | అనంతపురం సర్కిల్ |
| కె. వెంకట్రామన్, అడిషనల్ ఇన్‌కంటాక్సు ఆఫీసరు | డిట్టో | డిట్టో |
| వి. ఎ. అజరయ్య, ఇన్‌కంటాక్సు ఆఫీసరు అండ్ అడిషనల్ ఇన్‌కంటాక్సు ఆఫీసరు | 3 వ సర్కిల్ మద్రాసు, నెం. 130 పూనమల్లి హైరోడ్డు మద్రాసు. | మద్రాసు 3 వ సర్కిల్ |
| వి. ఎ. అజరయ్య, 1 వ అడిషనల్ ఇన్‌కంటాక్సు ఆఫీసరు | డిట్టో | డిట్టో |
| పి. రామచంద్రమొదలియార్, 2 వ అడిషనల్ ఇన్‌కంటాక్సు ఆఫీసరు | డిట్టో | డిట్టో |
| కె. సుబ్బారావు, ఇన్‌కంటాక్సు ఆఫీసరు | మద్రాసు స్పెషల్ నార్తు సర్కిల్, నెం. 132 పూనమల్లి హైరోడ్డు, కీల్‌పాకు, మద్రాసు | మద్రాసు స్పెషల్ నార్తు సర్కిల్ |
| ఎ. వి. ఆరొగ్యస్వామి, ఇన్‌కంటాక్సు ఆఫీసరు | చిత్తూరు సర్కిల్ చిత్తూరు | చిత్తూరు సర్కిల్ |
| ఎ. యల్. రామకృష్ణన్, అడిషనల్ ఇన్‌కంటాక్సు ఆఫీసరు | డిట్టో | డిట్టో |

గమనిక:—ఆయా సర్కిలుకు సంబంధించిన అధికారముగల హద్దులయొక్క లేక మనుష్యులయొక్క జాబితా ఆయా ఇన్‌కంటాక్సు ఆఫీసు నోటీసుబోర్డులలో ప్రచురింపబడును.

ముఖ్య గమనింపు:—యిందుకు సంబంధించిన మనుష్యులందరు గమనించవలసిన దేమనగా ఇన్‌కంటాక్సు ఆక్టు 5 (5), 5 (6) మరియు 5 (7 ఎ) సెక్షనుల క్రింద ఇన్‌కంటాక్సు ఆఫీసర్ల అధికారపు హద్దులు అప్పుడప్పుడు మార్చబడవచ్చును. ఆదాయము తెలియచేయు నమూనా (రిటర్న్సు) అందచేయు కాలమునకు అధికారపు హద్దులలో మార్పు కలిగినప్పటికిన్ని ఇప్పుడున్న అధికారపు హద్దుప్రకారం రిటర్న్సు నమూనా అందజేసిన యెడల పైన ప్రచురించిన నోటీసుకు సరియైన సమాధానం అందజేసినట్లు అగును. అధికారపు హద్దులలో మార్పులు కలిగినచో ఇన్‌కంటాక్సు ఆక్టు 5 (7 ఎ) సెక్షనులో నిర్ణయించినట్లు ఆయా ఆఫీసర్లకు రిటర్న్సు నమూనాలు పంపబడునట్లు ఏర్పాట్లు గావించబడినవి.

# భిన్నరాజ్యకూటముల మధ్య సామరస్య సంధానమే భారతదేశ లక్ష్యం

## అంతర్జాతీయరంగంలో భారతభూమికపై సర్ బి. యన్. రావు ప్రకటన

న్యూయార్కు, ఏప్రిలు 25: "అంతర్జాతీయ వ్యవహారాలలో భారతప్రభుత్వం కేవలం తటస్థవిధానమునే అవలంబించుట లేదు. ప్రపంచంలో శాంతి పెంపొందుటకు ఏదో కొంత సహాయభూతముగా ఉండే నిమిత్తం కర్తవ్యనిర్ణయంలోనూ, కార్యనిర్వహణలోనూ తన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకొనుటకే భారతప్రభుత్వం ప్రయత్నించుచున్నది" అని భారతప్రభుత్వరాజ్యాంగ సలహాదారు ఐక్యరాజ్యసమితిలో భారత ప్రభుత్వ శాశ్వత ప్రతినిధి అయిన సర్ బెనిగల్ నరసింగరావుగారు, అమెరికాలో ఇండియా లీగ్ వారు సమితి భారత ప్రతినిధివర్గం గౌరవార్థం ఏర్పాటుచేసిన సన్మాన సభలో ప్రసంగిస్తు స్పష్టంచేశారు.

ఇండియాలీగ్ ఉపాధ్యక్షుడు లూయీఫిషర్ సభలో మాట్లాడుచూ, "తటస్థవిధానమునే గడ్డిగా ఆరాధించక, అమెరికాతో సంబంధబాంధవ్యాలు భారతదేశం బాగా పెంపొందించుకోవలెననీ, అమెరికన్ ప్రజలు భారతదేశానికి సహాయపడుటకు ఆపేక్షులుగా ఉన్నారని విజ్ఞప్తిచేశాడు. ఫిషర్‌కు సమాధానపూర్వకంగా సర్ బి. యన్. రావుగారు ప్రసంగిస్తు యిలా అన్నాడు.

"భారత ప్రభుత్వ స్థితిని సరిగా అవగాహన చేసుకోలేక పోవుటవల్ల కొంత అపోహ ఏర్పడింది. ఐక్యరాజ్యసమితియెడ భారతదేశానికి పరిపూర్ణ విశ్వాసం ఉన్నది. ప్రభుత్వస్థాపనకు ఐక్యరాజ్యసమితి బీజప్రాయమని భారత ప్రభుత్వం విశ్వసించుచున్నది.

భారతదేశములో కామన్వెల్తులో ఉన్నంతమాత్రమున ఫలానా రాజ్యకూటమిలో భారతదేశం చేరిపోయినదని అర్థం తీసుకూడదు. అంతేగాదు కామన్వెల్తులో ఉన్న భారతదేశము ఐక్యరాజ్యసమితి వ్యవహారములలో తనభూమికనునిర్వహించలేదని అనుకొనుటకు కారణంకన్పించదు.

ఐక్యరాజ్యసమితి ప్రధానముగా చేయవలసిన పని రాజీ పరిష్కారము. రెండు భిన్నరాజ్యకూటముల మధ్య తగాదా యేర్పడినపుడు, వీటి రెండింటి తగాదా పరిష్కరించుటకు, యీ రెండు కూటములకు చెందకుండా విడిగా ఉన్న రాజ్యము యేదీ లేదు. యీ ద్వివిధ కూటముల తగాదా పరిష్కరించుటకు ఒక రాజ్యం విడిగా ఉండుట అవసరం. లేకపోతే మానవనాగరకతకు ఘోర విషాద ఫలితాలు సంభవించగలవు.

కాబట్టి మరొక హిరోషిమా సంఘటనకు లోనుగాకుండా ప్రపంచం తప్పించుకోవలెనంటే, ద్వివిధకూటములకు సామరస్యం పెంపొందించుటకు యేదైనా ఒక రాజ్యం విడిగా ఉండుట అవసరం. సరిగా అదే భారతదేశ సంకల్పం. ఈ భూమికను నిర్వహించుటకే భారతదేశం నమ్రతతో ప్రయత్నించుచున్నది.

ఈ సందర్భములో "తాటస్థ్యము" అనేది సరియైనమాటకాదు. ప్రపంచ ప్రతి దృష్ట్యాచూస్తే, భారతదేశంస్వతంత్రవిధానం అవలంబించుట విధిగా అవసరం. భారతదేశం కామన్వెల్తులో ఉన్నప్పటికి యీభూమిక నిర్వహించగలదు. భారతదేశం అనేక పొరపాట్లు చేయవచ్చు. కాని భారతదేశ నిష్కపట వర్తనలో నమ్మకం కల్గినంతే ప్రపంచము ప్రశాంతముగా ఉండగలదు.

ఐక్యరాజ్యసమితి భారత ప్రతినిధివర్గ నాయకుడు సెతల్వాడ్ మాట్లాడుతూ పెరల్ బక్, లూయీఫిషర్ మొదలగు మిత్రులు ఇండియా లీగ్ సభలలో ఉపన్యాసముల ద్వారా భారతదేశమునకు ఎంతో మేలు చేశారని అన్నాడు.

లూయీఫిషర్ మాట్లాడుతూ, పండిత జవహర్లాల్ నెహ్రూ అమెరికా వచ్చినప్పుడు భారతీయులయెడ అమెరికన్లకు ఎంతసద్భావమున్నదో ప్రత్యక్షంగాచూడగలడని, ట్రూమన్ అధ్యక్షుడి లగాయతూ సామాన్య అమెరికన్ పౌరునివరకూ అంతా భారతదేశానికి సహాయంచేయవలెనని స్వయంపూర్వకంగా ఆకాంక్షిస్తున్నారనీ, అమెరికాసహాయం, ఆర్థికంగా భారతదేశంపై ప్రాబల్యం సంపాదించుటకేనని భయపడ నవసరంలేదని అన్నాడు.

"మేము తటస్థంగాలేము యుద్ధసమయంలోనే తాటస్థ్యం. ప్రజాస్వామ్య సూత్రానుసరణము ప్రజాసామాన్య జీవన ప్రమాణాభ్యున్నతియిదే భారతదేశలక్ష్యం. అమెరికా ఆర్థికసహాయాన్ని భారతదేశం స్వీకరిస్తుంది. భారతదేశంపై అమెరికా ఆర్థిక ప్రాబల్యం ప్రసక్తికే తావులేదు. భారతదేశమిప్పుడు ఆర్థికంగా సర్వస్వతంత్రమైన దేశముగనుక, యిటువంటిదేమైనా సంభవించే అవకాశముంటే తన్నుతాను రక్షించుకోగలదు.

భారతప్రతినిధివర్గ సభ్యురాలు శ్రీమతి రేణుకారే కూడా సభలో మాట్లాడింది.

# ముదుసలి మొగుడితో కాపురంకంటే జెయిలే హాయి

మోతిహారీ, (బీహార్) ఏప్రిల్ 25: 50 యేండ్లు వయస్సుగల తన భర్తతో కాపురం చేయుటకంటే, జెయిల్లో ఉండుటే తన కిష్టమని 16 యేండ్ల వధువు ఒకర్తె, సబ్ డివిజనల్ మేజస్ట్రేటుకు విన్నవించుకొన్నది. కోర్టులో కాలుపెట్టగనే ఆమె కన్నీరు కాల్వలైకట్లు ఏడ్వ నారంభించింది. ఆమె భర్త దాఖలు చేసుకొన్న అర్జీ విషయం తేలేవరకూ, తలిదండ్రులవద్ద ఉండేందుకు ఆమెకు మేజస్ట్రేటు అనుమతి యిచ్చాడు.

## కొత్తపోస్టుమాస్టరు జనరలు

చెన్నపట్నం ఏప్రిల్ 23: శ్రీ డి. భీమరావుగారు మదరాసు పోస్టుమాస్టరు జనరలుగా శ్రీ యం. వాస్నెయక్ గారినుండి చార్జి తీసుకొనిరి.

శ్రీ డి. భీమరావుగారు యిదివరకు ఢిల్లీలో పోస్టు టెలిగ్రాఫు డిప్యూటీ డైరెక్టరు జనరలు (సిబ్బందులు) గా నుండిరి.

శ్రీ వాస్నెయక్ గారు లండన్‌లో కామన్వెల్తు కమ్యూనికేషన్సు కౌన్సిలునకు భారతీయ ప్రతినిధిగా నియమింపబడియున్నారు.

# భారత పరిశ్రమలకు పెట్టుబడి పెట్టేందుకు అమెరికా పారిశ్రామికుల ఉత్సాహం

(ఆంధ్రపత్రిక విలేఖరి)

న్యూఢిల్లీ, ఏప్రిల్ 23: అమెరికా వ్యాపార ప్రముఖులు పలువురు త్వరలో ఒక సమావేశము జరిపి భారతదేశంలో విదేశీ పెట్టుబడికి ఉండగల సౌకర్యాలను గురించి ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ, చేసిన ప్రకటనను చర్చించెదరని తెలుస్తున్నది. స్థూలంగా, పండిట్ నెహ్రూ ప్రకటన అనుకూలంగానే ఉన్నట్లు అమెరికను పారిశ్రామికులు భావిస్తున్నారని వినవచ్చింది.

అమెరికా భారతదేశములకు మైత్రీ ఒడంబడిక జరిగిన తరువాత అమెరికను పెట్టుబడి భారతదేశానికి రావడానికి ఎక్కువ వీలున్నదని, అట్టి పెట్టుబడి ధారాళంగా లభించగలదని ఇక్కడి పారిశ్రామిక వ్యాపారవర్గమునకు చెందిన ప్రముఖులు భావిస్తున్నారు.

భారతదేశం కొన్ని దేశాలతో వస్తుమారకం ఒడంబడికలు కుదుర్చుకొనుటకు ప్రయత్నిస్తున్నది. సోవియట్ రష్యా, ఇటలీ, ఆస్ట్రేలియా ప్రభుత్వముల సూచనపై భారతీయ ప్రభుత్వం ఆప్రభుత్వాలకు తన అవసరములను వివరిస్తూ నివేదికలను పంపినట్లు తెలుస్తున్నది. అదేవిధంగా ఆదేశాలు తమ్మ అవసరములను భారత ప్రభుత్వానికి తెలియచేయగలవు.

అప్పుడు రెండుజాబితాలను పరిశీలించి భారత ప్రభుత్వం వస్తుమారకపు ఒడంబడికలను కుదుర్చుకోవటంగురించి ఆప్రభుత్వములతో రాయబారములను ప్రారంభించును.

ఇదివరకే ఇట్టి ఒడంబడికలను కుదుర్చుకోవడంపై ఫ్రాన్సు, ఆస్ట్రేలియాలతో భారతప్రభుత్వ రాయబారులు సంభాషణలు జరుపుచున్నారు.

## కృష్ణాజిల్లా గృహవైద్యుల సంఘం

విజయవాడ, ఏప్రిల్ 20: కృష్ణాజిల్లా హోమియోపతి వైద్యుల సంఘం వారు వి. ఎస్. రామబ్రహ్మంగారి అధ్యక్షతను ఇక్కడ సమావేశమై పశ్చిమ గోదావరిజిల్లా హోమియోపతి సంఘము వారు చేసిన కాలేజి తీర్మానమునకు సరణ పంపిరి. నూతన సంవత్సరమునకు డాక్టరు వావిలాల శ్రీనివాసమూర్తిగారు అధ్యక్షుడుగ, కె. నాగభూషణంగారు ఉపాధ్యక్షుడుగ గాదిరాజు వెంకటేశ్వరరావు ప్రధాన కార్యదర్శిగ, ట్రెజరరుగను, ఇ. రంగగోపాలరావుగారు సహాయ కార్యదర్శిగను ఎన్నుకోబడిరి. డాక్టరు ఎం. సరురాజు వి. ఎస్. రామబ్రహ్మంగార్లను రాష్ట్రసంఘమునకు సభ్యులుగ ఎన్నుకొనిరి.

### దేశీయవైద్యసంఘ వార్షికోత్సవము

విజయవాడ దేశీయ వైద్యసంఘ వార్షికోత్సవం నిన్న ప్రమేహగజకేసరి, రావుసాహెబ్ గారపాటి ఆంజనేయచౌదరి గారి అధ్యక్షతను జరిగినది.

వైద్యరాజ దాశ్యం వెంకటరామానుజమూర్తిగార్ని అధ్యక్షులుగను ప్రపంచ పర్యటన వైజ్ఞానిక వైద్యసార్వభౌమ మల్లెల శోభనాచలచక్రవర్తిగార్ని కార్యదర్శిగను ఉరిటి సూర్యనారాయణ, గుంటూరు రాజుగార్లను ఉపాధ్యక్షులుగను, నాగోతి రాములుపాత్రుడుగార్ని కోశాధిపతిగను, అవనిగడ్డ విద్యాసాగరరావుగార్ని సహాయ కార్యదర్శిగను, పదిమందిని కార్యవర్గ సభ్యులుగను ఎన్నుకొనిరి. యీ సంఘము నకు రు 1000-0-0 లు నిల్వయున్నూ, రు 1000-0-0 వైద్యగ్రంథాలయమున్నదనియు, రాష్ట్రపతి భోగరాజు పట్టాభి సీతారామయ్యగార్కి స్వాగతపత్రమొసంగినట్లున్నూ, స్వతంత్రభారత దినోత్సవము జరిపినట్లు నివేదికలో తెల్పిరి. టీపార్టీ అభివందనములతో సభముగిసినది.

### అగ్ని ప్రమాదము

ప్రొద్దుటూరు, ఏప్రిల్ 23: ఈ తాలూకాలోని చిన్నశెట్టిపల్లె గ్రామమందు నిన్న అగ్నిప్రమాదము సంభవించి దాదాపు 18 కొట్టములు భస్మీపటలమయినవి. జిల్లా ఫైరు ఆఫీసరు శ్రీ బి. వి. శాస్త్రి, బి. ఏ. గారు స్థానిక అగ్నిమాపక దళమువారిని వెంటనిడికొని అచ్చటికెళ్ళి గ్రామములోయు అగ్నిహోత్రుని కాహుతి గాకుండ నివారించినారు. ఈ ప్రమాదము వల్ల దాదాపు రు. 8000 లు నష్టము సంభవించి యుండునని చున్నారు. (స్వ. వి.)

### గుం. జి. రాజకీయ బాధితుల సంఘ కార్యాలయము

తెనాలి, ఏప్రిల్ 23: గుంటూరుజిల్లా రాజకీయ బాధితుల సంఘ కార్యాలయము యీ రోజునుండి తెనాలి 23 వ వార్డు బిన పాడుకు మార్చబడినది. అని ఐసు ప్రెసిడెంటు కృష్ణమూర్తిగారు తెలిపిరి.





# తుంగభద్ర ప్రాజెక్టుకు అనుబంధంగా విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి ఫోర్ బే నిర్మాణం

## ఎక్కడ జరగవలెనో నిర్ణయించుచు భారత ప్రభుత్వ ఉపసంఘ నివేదిక

(ప్రత్యేక విలేఖరి)

మకాం హోసపేట, ఏప్రిల్ 24: తుంగభద్ర ప్రాజెక్టుకు అనుబంధంగా విద్యుచ్ఛక్తి ఉత్పత్తిచేయుటకు వలసిన ఫోర్ బే (నీటికాలువ) ఎచ్చట తవ్వవలెనని నిర్ణయించేందుకు భారత ప్రభుత్వం ఏర్పాటు చేసిన దివాకర్ ఉపసంఘము, ప్రదేశ పరిశీలనానంతరం నిన్న నిచ్చట సమావేశమై నివేదిక తయారుచేసెరి.

పట్టాభిరామాలయ ప్రాంతమునగల 40 ఎకరముల స్థలమే ఇందుకు అనుకూలముగానున్నదని, ఐతే ఇచ్చట భూగర్భములో చారిత్రక పరిశోధనలకు అనువైన శాసనములు ఏవైనా ఏమైన ఉన్న వేమో ఆర్కియాలాజికల్ శాఖవారు ఒక సంవత్సరములోగా శోధించి అట్టి వేమీ లేనియెడలనే ఇచ్చట కాలువ తవ్వవలెననీ, సంఘమువారు అభిప్రాయపడినట్లు తెలిసినది. శోధనకగు వ్యయమును ఇంజనీరింగుశాఖవారే భరించవలెనని, కాలువతవ్వే ప్రదేశంనుంచి తరలింపబడిన వస్తువులను ప్రత్యేక ప్రదర్శనశాలలో ఉంచవలెననికూడ వారు సూచించినట్లు తెలిసినది.)

ఇంజనీరింగుశాఖవారు, ఇదివరకే ఇచ్చట 40 గుంటలు త్రవ్వి చూచిరనీ చారిత్రక విలువగలవేమీ కనిపించలేదని తెలిసినది.

ఈ కాలువ తవ్వుటకు రెండు సంవత్సరములు పట్టునని అంచనా వేసియుండుటచే సంఘమువారి నిర్ణయము కాలయాపనకు కారణము కాదని, ముందు పవర్ కాలువ త్రవ్వుట పూర్తిచేయబడి, పిమ్మట ఫోర్ బే విద్యుచ్ఛక్తి సహాయాలతో నిర్మించెదరని కూడ తెలిసినది.

## తుంగభద్ర ప్రాజెక్టు నిర్మాణంలో రెండవ దశ ప్రారంభం

తుంగభద్ర ప్రాజెక్టుడాం నిర్మాణంలో రెండవ దశ నిన్న దివాకర్ గారిచే ప్రారంభింపబడెను. దివాకర్ గారిని ప్రారంభోత్సవము జరుపకోరుచు, చీఫ్ ఇంజనీరు తిరుమలయ్యంగారూ, డాం చరిత్రను వివరించిరి.

పునాదికి గాను తొలువబడిన కొండ అంతర్భాగములో మన్య శంకుస్థాపన కావించుచు, దివాకర్ గారూ, ముందు యుగంలో కూడా యీ ప్రాజెక్టు అఖండ సేవ కావించుగాక అనిరి.

పిమ్మట ఖోసలా, డా॥ చక్రవర్తి, హైదరాబాదు ఇంజనీర్లు శేషాద్రికృష్ణమూర్తి, సీతారామరావు, యస్. కె. అయ్యరు, ప్రాజెక్టు సూపర్నెంటు వెంకట్రామన్ గార్లు, ఒకరివెనుక ఒకరు సిమెంటుపోసి, ఎలక్ట్రిక్ స్విచ్చేటరును త్రిప్పి, డామునకు పునాది వేయబడినదని హర్షధ్వనుల మధ్యనెల్లడించిరి. పురోహితులు పూజలు కావించిరి.

## దివాకర్ ఉపన్యాసం

భారత ప్రభుత్వ సమాచారశాఖ మంత్రి దివాకర్ నిన్న నిచ్చట జరిగిన పౌర సభలో ఉపన్యసించుచూ మన దేశ చరిత్రలో ప్రస్తుతం గొప్ప నూతన దశారంభం ఐనదనిరి. సర్దార్ పటేల్ ప్రభుత్వమునకు సర్వశక్తులా ప్రజలందరూ సహాయపడి, మన విజ్ఞాన సాంప్రదాయముల కనుగుణమైన ఒక నూతన దృక్పథము నలవరచుకొనవలెననిరి. న్యాయవాది సంఘము, పురపాలక సంఘము, వ్యాయామ మండలి, కాంగ్రెసు కమిటీ, విద్యారణ్య సమితి వార్ల పరంగా దివాకర్‌కి స్వాగత పత్రములు సమర్పింపబడెను. వాటికి సమాధానమొసంగుచు దివాకర్ గారు తాముకూడ ఒకసాధారణ కాంగ్రెసు సేవకుడే అనిరి. భాషాప్రయుక్త రాష్ట్రములపై నాయకత్రయ నివేదికను గురించి ప్రస్తావించుచు, వార్తా పత్రికలలో కొందరు కర్ణాటక ప్రముఖులు ఆంధ్రరాష్ట్రము ముందు రావచ్చునని అన్నారని ప్రకటిత మైనదని, ఐక్య కంఠంతో కర్ణాటకులంతా త్వరలో తమరాష్ట్రం కావలెనని అంటోంటే, ఏ ఒక్కరో వ్యక్తిగతంగా అట్లు అనినయెడల దాని కట్టి విలువ వుండదనిరి. మే మొదటి వారంలో కర్ణాటక రాష్ట్ర కాంగ్రెసు సమావేశంలో యీ భాషారాష్ట్ర సమస్యపై నిర్ణయం చేయబడుననిరి. నాయకత్రయ నివేదికను, నారిపన్న ఇతర ప్రాముఖ్య విషయములే కారణమనియూ, తమకు మాత్రము భాషా రాష్ట్ర సమస్యను వాయిదా వేయుట అవసరం నాయకులు కావలెననియూ, అయినను ప్రజాభిప్రాయమును తెలుపుకొన వచ్చుననియూ, దివాకర్ గారనిరి.

శ్రీ బి. అనంతాచారి గారింట నేనేటి విందుజరిగెను. తుంగభద్ర ప్రాజెక్టు రిలీఫ్ కమిటీవారు, డాము కట్టుటచేత నీటమునిగిన...

# పర్షియాలోని చెకోస్లవేకియా రాయబారి

## ప్రాగ్ రమ్మని పిలుపు

టెహరాన్, ఏప్రిల్ 25: పర్షియా ప్రభుత్వ విజ్ఞప్తి ననుసరించి టెహరాన్‌లోని తమ రాయబారి రిచర్డ్ స్లానిస్కీని చెకొస్లవేకియా ప్రభుత్వం స్వదేశానికి పిలిపించినట్లు నేడిక్కడ తెలియవచ్చినది.

వాక్లావ్ వ్రానా పర్షియాలో తమ రాయబారిగా చెకొస్లవేకియా ప్రభుత్వం నియమించింది. స్లానిస్కీ మరొక దేశమునకు రాయబారిగా నియమింపబడినట్లు తెలుస్తున్నది. స్లానిస్కీ, జకొస్లవేకియాలోని పరిస్థితులను బయటకు వెల్లడించే టట్లు చేస్తానని బెదరించుటచే ఆయన ఇక పర్షియాలో ఉండతగనివాడని పర్షియా ప్రభుత్వం నిశ్చయించిందట. క్రొత్త సంవత్సరారంభంలో పర్షియారాజును అభినందించడానికి స్లానిస్కీ వెళ్ళలేదు. తన సిబ్బందిలో యెవరినీ వెళ్ళనీయలేదు. మామూలుగా విదేశరాయబారులు సంవత్సరాదినాడు రాజును అభినందించడం ఆచారం.

ఫిబ్రవరిలో పర్షియా రాజుపై హత్యా ప్రయత్నం చేశాడనే నేరంపై జెక్ విద్యార్థిని పర్షియా అధికారులు అరెస్టుచేశారు. అతనిని విడుదలచేయవలసిందిగా స్లానిస్కీ కోరగా పర్షియా ప్రభుత్వం నిరాకరించింది. దీనితో స్లానిస్కీకి పర్షియాప్రభుత్వానికి పేచీ యేర్పడింది.

దేశమునకు హానికరమగు చర్యలు చేస్తున్నారనే ఆరోపణమోపి, ముగ్గురు జెక్ పౌరులను పర్షియా పోలీసులు 15 రోజుల గడువుతో వారికి దేశాన్ని వదలి పోవలసిందిగా ఉత్తర్వుచేశాడు.

# ఆస్ట్రియన్ సంధి విషయమై మరల ప్రతిష్టంభన

లండన్, ఏప్రిల్ 25: ఆస్ట్రియాయందలి జర్మన్ ఆస్తులకుగాను ఆస్ట్రియా రష్యాకు చెల్లించవలసిన మొత్తముపై భేదాభిప్రాయము కలుగుటచేత ఆస్ట్రియను సంధిపత్రమును రచించుటకు నేడు ఉదయము లండనులో జరిగిన నాల్గురాజ్యముల సభలో ప్రతిష్టంభన మేర్పడెను. 15 రోజులు ఈస్టర్ సెలవుల అనంతరము ఈ నాల్గురాజ్యముల ప్రతినిధులు మొదటిసారి నేడు సమావేశమైరి. ఈ సమావేశములోనిది 43 వ సభ. ప్రస్తుత సమావేశమునకు పూర్వము నూరుసభలు జరిగినమీదట ఒడంబడికకువచ్చు ప్రయత్నములు వదలివేయబడెను.

# ద. ఆఫ్రికా సమస్య తిరిగి వాయిదా

ఫ్లషింగ్ మెడోస్, ఏప్రిల్ 25 ద. ఆఫ్రికా భారతీయుల యెడల ఆదేశ ప్రభుత్వ మవలంబించుచున్న వైఖరి విషయమై ఐక్యరాజ్య సమితి యాజకీయకమిటీలో రాబోవు వారముచర్చ జరుగవలసియున్నది. కాని చర్చ వాయిదా పడవచ్చునని యిచ్చటి ప్రతినిధుల ద్వారా తెలియుచున్నది.

గడి ప్రాంత్యజనులకు పరిహారం ఎక్కువివ్వవలెననీ, కర్ణాటక విద్యారణ్య సమితివారు కర్ణాటక రాష్ట్రమునకు ప్రత్యేక చారిత్రక పరిశోధకాలయమును స్థాపించవలెననియు విజ్ఞాపనలు కావించిరి.

దివాకర్ నేడు సర్పనహళ్లి మీదుగా బళ్ళారి వచ్చిరి.

## డా॥ రామలింగా రెడ్డిగారు

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఉపాధ్యక్షుడు డా॥ కట్టమంచి రామలింగా రెడ్డిగారు నిన్న స్థానిక హోస్టలు క్రైస్తవ నింగు స్కూలు ఆవరణలోను, నేడు కాస్మాపాలిటన్ క్లబ్బులోను, భారత రాజకీయములను గురించి ఉపన్యసించిరి. నేడు ప్రజా స్వామికత్వము కంటె నిరంకుశ వాసన కల ప్రభుత్వమే భారతజాతిని ముందుకు తేకలదు. నెహ్రూ పటేలు నాయకులు కడు సమర్థతతో కేంద్రములో ప్రభుత్వమును నిర్వహించుచున్నారు. ప్రజాస్వామికత్వము కాలేజీలలోను పాఠశాలలోను మాత్రము తక్కించవలెను. విప్లవమైన పిమ్మట వచ్చిన పార్టీ ప్రభుత్వంలో ప్రజాస్వామికం ఉండుటకు అగత్యం లేదు. కావున అందరూ కేంద్ర నాయకులకు మనఃపూర్వకంగా సహాయపడి, నవజాతి పురోభివృద్ధికి గట్టి పునాది వెయ్యవలెను, అని రెడ్డిగారు ఉపన్యసించిరి.

# రేడియో ప్రోగ్రాములు

## సంగీతాది కాలక్షేపాలూ, ప్రసంగాలూ మొదలైనవి

(ఏప్రిల్ 28 వ తేదీ గురువారం)

మద్రాస్(1): ఉదయం 7-30 మంగళం ఆర్. గణేశన్ గాత్రం. మధ్యాహ్నం శాంతాబాయి మాధవరావు గాత్రం. సాయంకాలం 5-30 కె. రంగనాథన్ నాగస్వరం. 7-30 అబ్దుల్ కరీంఖాన్ పాటల రికార్డులు. రాత్రి 8-00 ఆంధ్రదేశ జానపద గీతాలు. 8-15 ముదికొండన్ వెంకట్రామ అయ్యర్ రాగం, తానం, పల్లవి. 9-15 జానపదసాహిత్య సంగ్రాహకుడు న్యాయమూర్తి ఎ. ఎన్. పంచాపకేశ అయ్యర్ ఇంగ్లీషు ప్రసంగం. 10-00 హెరాల్డు విలియమ్స్ పాశ్చాత్య సంగీతం.

మద్రాస్ (2): ఉదయం 7-15 డి. కె. పట్టమ్మాళ్ పాటల రికార్డులు. 8-30 ఎ. వి. కృష్ణమాచారి ఫైలన్. మధ్యాహ్నం 1-0 మహిళామండలి. 2-15 కామాక్షి చంద్రశేఖరన్ వీణ. సాయంత్రం 4-0 తెరజుంపూర్ వి. శ్రీనివాసాచారి మూర్ గాత్రం. 6-30 గ్రామస్థుల కార్యక్రమం, రాయప్రోలు, దేవులపల్లి, నరజాడ, బాలాంత్రపు ప్రభృతుల జాతీయగీతావళి. 7-45 నూతన పరిశ్రమలు అనే శీర్షికను-నూతన రసాయనిక పరిశ్రమనుగూర్చిన వి. సూర్యనారాయణగారి ప్రసంగం. రాత్రి 9-30 మున్నీ దేవి పాటల రికార్డులు. 9-40 ఎం. ఆర్. శంకరమూర్తి గాత్రం.

విజయవాడ: ఉదయం 7-15 రేడియో ఆర్టిస్టుల వీణ, ఫైలన్. 7-30 పి. రమణకుమారి గాత్రం. 8-15 చల్లపల్లి కృష్ణమూర్తిశాస్త్రి ఫైలన్. సాయంకాలం 5-30 రమణకుమారి గాత్రం. 6-20 కృష్ణమూర్తి శాస్త్రి ఫైలన్. 6-30 గ్రామస్థుల కార్యక్రమం. మద్రాసునుంచి రిలే. 7-30 పలని విజయలక్ష్మి పాటల రికార్డులు. 7-45 కాలచక్రము. అంతర్జాతీయ వ్యవహారాల సింహావలోకనం అన్నపనేని వెంకట సుబ్బయ్య ప్రసంగం. 8-0 "అంతా నీ కోసమే" నాటిక. 8-15 రేడియో వాద్యగోష్ఠి.

హైదరాబాద్: ఉదయం 7-30 'జగకిర్తానవాలా' 8-20 సరస్వతీరాణి సంగీతం. 8-40 కాయిమ్ హుస్సేన్ ఖాన్ సారంగి. 9-15 జాతీయగీతాలు. మధ్యాహ్నం 12-30 'రసీలీ నాషేత్ర' 1-20 పారిశ్రామిక కార్మికులకు తెలుగు ప్రసంగం. సాయంత్రం 5-0నుంచి 5-30వరకు సరస్వతి రాణి మాధవరావు, హసన్ మహమ్మద్ పాటలువగైరా. 6-30 పట్నవాసులకు తెలుగు కార్యక్రమం. కె. కోదండపాణి కర్నాటక సంగీతం. 'ఊర్వసీ ప్రవాసం' నుంచి పఠనం.

7-15 గ్రామస్థులకు తెలుగు కార్యక్రమం. ఉపవృత్తులు శీర్షికను లేసు ఎంబ్రాయిడరీ కట్టుగురించి సంభాషణ. సాగునీటి సదుపాయము గురించి పి. కృష్ణమూర్తి ప్రసంగం. 7-45 జనతా కీర్తంద్రుస్తీ, డాక్టర్ దేవ్ హిందూస్థానీ ప్రసంగం. 8-30 నుంచి 9-0 వరకు పాటలు వగైరా. 9-15 'మొహబ్బత్ కా గీత్' మహమ్మద్ యాకూబ్ 9-20 నుంచి 11-0 వరకు పాటలు వగైరా.

# మదరాసు ధరలు

మదరాసు, ఏప్రిల్ 26:

వేరుసెనగ: (581 పా 1-కి ఎక్సు కోస్తాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు(కాత్తది) రు. 167-8-0

వేరుసెనగనూనె ఎక్సు పెల్లర్ (గ్యారంటీ) (సేల్సుటాక్సుతో సహా) రు. 340-0-0

ఆముదం బజారుడెలివరీ ఎక్సుపెల్లర్ ఇంగ్లీషుకాండి 500 పౌనులు గలది

| | |
|---|---|
| మొదటి రకం | రు. 350-0-0 |
| రెండవ రకం | రు. 340, 343 |
| కొంకాయనూనె (39 పౌను గల డబ్బా) ఒకటికి | రు. 33-0-9 |

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 74-8-0 పెట్లా బంగారు తులం 114-10-0 మూసబంగారు 113-0-0 సీమవెండి తులం 100-కి (రెడీ) 183-4-0 వెండి తులం 1 కి 1-14-6.

పంచదార

| | |
|---|---|
| "కాన్పూరు" (2 అందరు) | రు 91-8-0 |
| అనకాపల్లి" (2 అందరు) | 91-4-0 |

# న్యూయార్కు దూది

న్యూయార్కు, ఏప్రిల్ 25.

మే 33.39/33.40 జూలై 32.58/32.59 అక్టోబర్ 28.95/28.95 డిసెంబరు 28.70/28.70 మార్చి 28.57/28.58 మే 28.37/నా. జూలై 27.35/27.45 అక్టోబర్ 25.53/నా.

| | | |
|---|---|---|
| మిడ్లింగ్ | హాజరు | 34.31 |
| మే | (గరిష్ఠధర) | 32.62 |
| | (కనిష్ఠధర) | 32.40 |



## నోటీసు

బళ్ళారి డి॥ ము॥ కోర్టులో
అస్సలు నంబరు 407/48

వాది పి॥ రంజానుసాబు
ఏదరి
ప్రతివాదులు:—కోక ఆదినారాయణబాబు వగైర

కోక అప్పారావుగారి కుమారుడు కోక ఆదినారాయణబాబు, భీమనపేట, బెజవాడ.

పై నంబరులో వాది రంజానుసాబు

1 వ ప్రతివాది ఆదినారాయణబాబు అయిన నీవు 2 వ ప్రతివాది అయిన హెచ్. ఆర్. బసవరాజప్ప పేరట 1-11-45 నాడు రు. 2500/- కు వ్రాసియిచ్చిన ప్రామిసరి నోటు 28-10-48 నాడు ట్రాన్సుఫరు పొంది 1 వ ప్రతివాది అయిన ఆదినారాయణ బాబుపైన దావాచేసి ఎన్ని పర్యాయములు సమనులు తీసుకొన్నప్పటికిన్ని జారిచేయించక తప్పించినందున యీ పత్రిక ప్రకటనద్వారా తెల్పను కోర్టు ఉత్తర్వు అయినందున మీకు తెలియచేయడమేమన సదరి రంజానుసాబు మీపైన పైమొత్తమును వడ్డిన్ని, కోర్టు ఖర్చులతో కూడా రాబట్టుకొను దావాచేసి మీయొక్క ఆక్షేపణగాని తకరారుగాని హాజరు పరుచుటకు 8-5-49 సదరి కోర్టులో 11 ఘంటలకు నియమించబడినది. సదరి వాయిదాలోపల మీరుగాని మీ తరుపున వకీలుగాని హాజరై మీకుఉన్న తకరారు హాజరుపరుచవలెను. లేనియెడల మిమ్ము ఎక్సుపార్టీ చేసి ఏకపక్షి తీర్పుచేయబడునని తెలుపవమైనది.

డి. గుండురావు,
వాది వకీలు.





Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, G T Madras